ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము - సంఖ్య ౩౮.

శ్రీరస్తు.

# ఆంధ్రకౌముది.

ఇది

గణపవరపు వేంకటపతికవి

ప్రణీతమగు

సర్వలక్షణశిరోమణిలోని వ్యాకరణ సీసమాలిక.



పరిషత్పత్త్రికనుండి పునర్ముద్రితము

కాకినాడ

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే బ్రకటితము.

1935

వెల 8 అణాలు.

కాకినాడ ముద్రాక్షరశాల.

# గ్రంథప్రశంస.



ఈగణపవరపు వేంకటపతికవి, నందవర బ్రాహ్మణశాఖకుఁ జేరినవాఁడు. ...గోత్రజుఁడు. ఆశ్వలాయనసూత్రుఁడు- ఈతని తండ్రి అప్పయార్యుఁడు, తల్లి ...మ్మ. నివాసము గణపవరము. ఇది కాశేపలీముఖ్య మని వేంకటేశ్వర విజ...లాసములో వ్రాసికొన్నాఁడు. ఏమండలములోనిదో- ఈతఁడు రచియించిన ...ములు:—

...శ్రీకరంబుగఁ బదిరెండవయేఁటఁ దారావళు ల్రచియించి ప్రౌఢిఁగన్న
...సునిమునిమీసంబు మొనయు నేఁట యమకశతకంబొనర్చి కౌశలముగన్న
...యిరువదియవయేఁట శృంగారమంజరియు నుదాహరణఁ జేసి ఘనతగన్న
...యిరువదే నగునేఁటఁ గృష్ణమల్లకథఁ జతుర్భద్రఁ జెప్పి సంతుష్టిఁగన్న
...సటియును బాలరామాయణ ద్విపదఁ బొసంగించి బహువిధ చాటుకవిత
...తిముదముగన్న నాదు జిహ్వాంచలంబు, తనివినొందదు కులదేవతావతంస
...వేంకటేశ్వరచరణారవిందమహిమ, నవనవోన్మేషపేశవర్ణనలఁగాక.
...అమరమునకుబదు [1]లభినవాంధ్రనిఘంటు కౌముది [2]కెనయాంధ్రకౌముదియును
...నయతిప్రాసలక్షణ సీసమాలిక[3] యాంధ్రప్రయోగరత్నాకరంబు
...ఖిల రేఫఱకారనిర్ణయపద్ధతి[4] మత్ప్రత్యయముల ప్రస్తారసరణి[5]
...గునిర్వదాఱుఛందములకువచనంబు[6] సమధికాలంకారసారమనుమ
...సత్కృతులు సేయు మాపేర సీకెచెల్లుఁ, గాక పెఱకవులకు నెట్లు కలుగ నేర్చు
...గార సీశక్తి యెక్కడనైనఁ గలదె, గణపవర యప్పనార్యు వేంకట కవీంద్ర.

సర్వలక్షణశిరోమణి, ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము నిందుఁ ...దు.

ఇందు మొదటిపద్యములోని వృత్తాంత మింతవఱకుఁ దెలియదు గాని ...పదానిలో నుదాహరింపఁబడిన 1. వేంకటేశాంధ్ర మను నామాంతరము ...సర్వలక్షణశిరోమణిలోని ద్వితీయోల్లాసము. రెండవది తృతీయోల్లాసము. ...ప్రథమోల్లాసములోని యొక ప్రకరణము. 4 ది యైదవయుల్లాసము మొద...ష్టది. 5-6లు దీని నాల్గవయుల్లాసములోని భాగములు. ఇదిగాక, కవితా...ము, నాయికానాయకలక్షణములు, కావ్యలక్షణము, రసప్రకరణము, శా...షప్రకరణము మున్నగునవియనేకప్రకరణము లీయుల్లాసములలో నిమిడియు

న్నవి. రెండవపద్యమున నంకములచే నిరూపింపఁబడినవి యాఱును నామమాత్రా వశిష్టము లని కవులచరిత్రయు, ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయవిలాసపీఠికయుఁజె ప్పుచున్నవి. ఇందలి యింకొకపద్యమునుబట్టి యీకవి వసంతతిలకభాణమును వె నిఁగించినట్లు కనఁబడుచున్నవి. మొదటిపద్యమున నుదాహరింపఁబడిన తారావళు లెన్ని గలవో కాని యిందు రేఫఱకారనిర్ణయమును దారావళిగాఁ జెప్పెదనని కవి ప్రతినచేసినట్లు కన్పట్టుచున్నది. ఇట్లు బహువిషయములను దెల్పు బహుగ్రంథ ములు రచియించిన యీతనికృతులలోఁ గొన్ని పోయిన వేమో గాని సర్వలక్ష ణశిరోమణి బహువిధముల లోకమున కుపకరించు గ్రంథమని మాత్రము వచింప వచ్చును.

కవికాలమును, గవులచరిత్రమును ప్రబంధరాజవేంకటేశ్వరవిలాసపీఠిక యును సరిగ నిర్ధారణచేయలేవు. ఇతఁడు ప్రబంధరాజవేంకటేశ్వర విలాసములో విన్నకోట పెద్దనార్యాదుల కావ్యాలంకార చూడామణ్యాదులను బేర్కొనుచు "సర్వలక్షణ సారసంగ్రహ, సరస్వతీవిలాస, సాత్యచింతామణి......లక్షణం బులకు లక్ష్యంబును" అని వ్రాసికొనియెను. ఇందుఁ బేర్కొనఁబడిన సర్వలక్షణ సారసంగ్రహము చిత్రకవి పెద్దనార్యుఁడు రచియించినదే కాని కూచిమంచి తిమ్మకవిది కాదని తలఁపవచ్చును. ఏమనఁగా- కవి తనగ్రంథముల యవతారికల యందే కాక యీసర్వలక్షణశిరోమణి యుల్లాసముల తుది గద్యములయందుఁ గూడ..."కర్ణాటతుండీర-చోళపాండ్యమండల ప్రముఖాఖిల మండలాఖండల దత్త మత్తసింధుర...రత్నాంబరాదివస్తు...నిఖిలశుభలక్షణ లక్షణకవి వేంకటపతికవి" యని వ్రాసికొన్న దానింబట్టిచూడఁగాఁ బాండ్యమండల ప్రభువులలోనాంధ్రకవుల నాదరించుటచేఁ బ్రశస్తికెక్కిన—"మండలేశ, పాండ్యమండలేశ, పాండ్యభూవిభు" మొదలుగాఁ గల విశేషణములచే వ్యవహరింపఁబడినవాఁడు విజయరంగచొక్క నాథఁభూపాలుఁడే యని పెక్కండ్రు దాక్షిణాత్యకవుల వ్రాఁతలవలనవిశ్వసింపఁదగి యుండుటచే నీకవి యతనికాలమందే, యనఁగా క్రీ. శ. 18 శతాబ్దము మొదట నుండినవాఁడై కూచిమంచి తిమ్మకవికి సమకాలికుఁడై యుండునని తోఁచును.

ఈగ్రంథములు నందందు "ప్రబంధరాజవేంకటేశ్వరవిలాసములో సరి చూచునది" యని యుండుటచేతను ఆగ్రంథము నవతారికలో నీగ్రంథములోని వేలువేలుభాగములు వేలువేలు కృతులుగాఁ బేర్కొనఁబడియుండుటచేతను నేది ముందురచియించెనో నిశ్చయించుట కవకాశములేదు గాని కవితాలక్షణము వేం

కర్ణాటాంధ్రము (ఆంధ్రనిఘంటువు) ఆంధ్రకౌముది, నిఖిలలేఖకాలంకారసర్వస్వము, షడ్వింశతిచ్ఛందోలక్షణము మొదలుగాఁ గల లక్షణములను ముందుగా రచియించి వానికి లక్ష్యముగాఁ బ్రబంధరాజవేంకటేశ్వరవిలాసమును రచియించి యందుఁ దాను బూర్వము రచియించిన యాయాలక్షణములను వేఱువేఱు కృతులుగాఁ జెప్పి తరువాత మఱికొన్నిలక్షణములనుగూడఁ జెప్పి యాపూర్వోక్తలక్షణము లన్నింటికిఁ గలిపి సర్వలక్షణశిరోమణి యను పేరుపెట్టి యుండు నని యూహింపఁ దగియున్నది.

గీ. వేంకటేశాంకితమ్ముగ వేంకటపతి, రచిత సర్వలక్షణశిరోరత్నకృతిని
యాఖ్యగఁ దలిర్చు నాంధ్రద్విరూపకోశ,మన నెలయు దశమోల్లాసమసమలీల.

అను పద్యమునుబట్టి యిది పది యుల్లాసములకుఁ దక్కువకాని గ్రంథ మని యాంధ్రద్విరూపకోశముతోపాటు మిగిలిన గ్రంథములుగూడ మిగిలిన యుల్లాసములలో నిమిడియుండు ననియుఁ దెలియుచున్నది.

ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసమును ముద్రించిన యముద్రితగ్రంథచింతామణి పత్రికాధికారులకును లక్షణశిరోమణి తెలియరాలేదు, కావుననే "యిక్కవి కృతులలో నొక్క వేంకటేశ్వరనిఘంటువు తప్పఁ దక్కినగ్రంథములు నామమాత్రావశిష్టములై యున్నవి." అని చెప్పియున్నారు. ప్రబంధరాజము నెఱింగిన కవులచరిత్రమును లక్షణశిరోమణి నెఱుఁగదు. కావుననే "రెండు మూఁడు కృతులు దక్క శేషించిన వన్నియు నామమాత్రావశిష్టము లయినవి" అని వ్రాసెను.

ఇంకను వేంకటపతికవింగూర్చి తెలిసికొనఁ బరిషత్పత్త్రిక 4 వ సంపుటము లలోఁ జూచునది. పైవిషయమును దానికి సంగ్రహమే.

ఇది వేయిచరణములుగల సీసమాలిక. సర్వలక్షణశిరోమణి పూర్తిగఁ బరిషత్పార్యాలయమునలేదు. అందుఁ గొముదిగల తాళపత్రసంపుటములు రెండున్నవి. అందొకటి యసంపూర్ణము, రెండవది పూర్ణమే గాని వ్రాఁతతప్పులు మెండు. ఈ రెంటినిబట్టి, వ్రాయించి దీనిని బ్రకటింపవలయు నని వెనుక పరిషత్కార్యాలయము చెన్నపురిలో నున్నపుడే సభ్యులు తలంచిరి. మాతృకనుండి నేనే యొక్కప్రతికను వ్రాసితిని. దానిని కొ. వేం. లక్ష్మణరావుపంతులుగారు నితరులును, సంస్కరించుటకు-దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారి కిచ్చియుండిరి. దానిని వారు సంస్కరింపకుండఁగనే కీర్తిశేషులైరి. వారియొద్దినుండి వ్రాఁతపుస్తకము మరలదొరకినదికాదు. అంతటితో నాయుద్యమ మప్పుడు తగ్గినది. అప్పు డప్పుడు శ్రీయుత గునుపాటి

యేనాదిరెడ్డిగారు మున్నగువారు తలంపుఁకుఁ దెచ్చుచుండుటచే నిటీవల దీనికి మరలనొక పుత్రికను వ్రాసితిని. దానిని శ్రీసూర్యరాయాంధ్రనిఘంటు కార్యాలయ నిర్వాహకులు బ్ర। శ్రీ చర్ల నారాయణశాస్త్రిగారు పరిష్కరించిరి. అదియే యిది.

దీనివిశేషము లిదియే చెప్పుకొనుచునుగాన నీ చిన్నిపొత్తమునకు విశేషించి విమర్శనము వ్రాయలేను.

ఈసంపూర్ణతాళపత్రపుస్తకము పరిషత్పుస్తకభాండాగారములో 16 వ సంఖ్యగలది. చివర-"౮౦౦ గ్రంథము. సిద్ధార్థినామసంవత్సరము ఆవణినెల ౧౫ తేది రాచవేల్పు కృష్ణమరాజు స్వహస్తలిఖిత"మని కలదు. ఇది పుదుకోటలో సంపాదింపఁబడినది. ఈ సంపుటములో దీనితోపాటు శబ్దమంజరి, ఆంధ్రనామసంగ్రహము, అకారాదిదేశి తెనుఁగునిఘంటువు, వేంకటేశాంధ్రము, ఆంధ్రశబ్దచింతామణి యును గలవు.

కొత్తపల్లి సూర్యారావు.

# విషయసూచిక.

శ్రీరామ.

# ఆంధ్రకౌముది.

---

క. శ్రీభామానర్మోక్తిక, భాభవనిజమందహాసధాగధగ శ్రీ
శోభితశుభతత్కుచకుం, భాభోగకిలాప వేంకటాచలవాసా.

వ. అవధరింపుము.

## సీసమాలిక.

శ్రీకరమ్ముగను సంస్కృతమునకును బ్రాకృతమునకుఁ గలలక్షణమ్ములు చెప్పి
తెనుఁగున నావిధమ్మున లక్షణము చేయ రాక్కుని యదియు నేరంబు గాదు
తొల్లిటిసుకవుల కెల్లను నను ధన్యుఁ గావించుతలఁ పింతె కాని యనుచుఁ
గుకవిజనాజ్ఞానఘోరాంధతమసముఁ బోఁగొట్టఁగల్గు కౌముదివిధాన
నిల మున్ను దెలుఁగున నెవ్వారెఱుంగని యాంధ్రకౌముది యనునట్టికృతిని
సీసమాలిక గాఁగఁ జేసితి నిపు డున్నకవులకు రానున్నకవుల కెల్ల
నుపకారముగ నిది యెపుడు నాచంద్రతారార్కమై కౌముది యటుల వెలయుఁ
గన నిందు సంజ్ఞాప్రకరణము మొదలుగఁ దత్తత్ప్రకరణముల్ దనరు వరుసఁ
దత్రిలింగపదంబు తద్భవం బగుటచేఁ దెలుఁ గనఁ దగె నట్టితెలుఁగు ప్రాకృ
తాభిధానముగాన నాలక్షణమ్ములు తొలుతఁ గవులకెల్లఁ దెలియవలయుఁ
దత్సమం బనఁగను దద్భవంబును నాఁగ దేశ్య మనఁగ నచ్చతెనుఁ గనంగ
గ్రామ్యంబు నాఁగను గలవైదుతెఱఁగులు వానిని వివరింతు వరుసతోడ
నది యెట్టు లన వినుఁ డబ్జాక్షుఁడు గురుండు గురువు వనమ్ము దరువన నిఁకఁ
దద్భవంబులు పొల్చు ధర్మంబు దరమంబు ద్రుహిణుండు దుగిణుండు ద్రోహి దోగి
శిఖ సిక లక్ష్మి లచ్చి లఘువు లగువు సముద్రము సంద్రము ముగ్ధ ముగుద
ముఖము మొకము ధనము దనము ఖని గని గర్వమ్ము గరువము ఘనము గనము
రోషము రోసము రుద్రాక్షము రుదురాక దాక్షిణ్యము దాకిరమ్ము
మర్యాద మరియాద కార్యంబు కర్జంబు స్మరుఁడు మరుఁడు నృకేసరి నెఱసరి
కావ్యంబు కబ్బము గంధంబు గందము యక్షులు జక్కులు యశ మసంబు
దీర్ఘిక డిగ్గియ యర్ఘ్య మగ్గువ శుద్ధి సుద్దగు శుక్రుండు సుక్కురుండు [కొమరుఁడు
హర్ష మానరుసంబు యముఁ డుజముఁడు చంద్రముఁడు చందురుఁడు కుమారుఁడు
భాషయు బాసయౌ దోషము దోసము చక్రము జక్కవ సంధ్య సంజ

స్నిగ్ధంబు నిద్దంబు శ్రీ సిరి మతి మది భగ్నంబు బన్నంబు బ్రహ్మ బొమ్మ
ఆజ్ఞప్తి యానతి యజ్ఞంబు జన్నంబు విష్ణుండు వెన్నుండు విద్య విద్దె
వైరము వేరము భారము బారము స్నానంబు తానంబు ధార దార
ద్యూతము జూదము స్థూలము తోరము సంభము కంబము ధాత తాత
భేదంబు బిద్దంబు భిక్షము బికిరము కుబ్జుండు గుజ్జుఁడు కులము కొలము
ఆత్మ యాతుమగుఁ పుణ్యంబు పున్నెంబు యత్నము జతనమ్ము రత్నము రతనము
దగ్ధ దగ్గి ద్వయము దోయి దిశ దెసయశా వీర్యంబు బీరంబు పృథివి పుడమి
శయ్య సెజ్జగు బ్రహ్మచారి బొమ్మచారి రూఢి రూడి యగుఁ జంద్రుఁడు చందు
ఢాలు డాల్ వాలము వాలు పలము పాల శల్యుఁడు సెల్లుండు సంఖ్య సంక
గుణము గొనమ్ము దక్షిణము దక్కినము కంఠమ్ము కంటము ఢక్క డక్క విధము
వితము వేశంతము వెంచ ఋక్షము రిక్క విధి విది వీథులు వీదు లనఁగ
దేశ్యము ల్దగు నింక తెంపరి పాత్రిక కఱద లదరులు చక్కటి రపాలు
మక్కువ యెరకువ పొక్కుడు రవణాలు కడిఁది యేడ్తెఱ గొండ్లి కడఁక క్రేడి
కడవన మిక్కిలి వెడ మొగి మొనకంబు పొలపంబు మఱకువ పొరి బిడారు
తివురుట వెనక్రేణి తెంకువ పూఁ పొగి వీచోపు నవి లలి విన్నఁదనము
పుచ్చడీక విలాతి యొచ్చెల పుయిలోట వదరులు మలఁత మెల్లిదము తెన్న
క్రచ్చఱ మర ప్రబ్బ యచ్చిక యనలారు సూడిద కడిపాయ బోదు లులివు
వేనవేలాకె నెవ్వీ గొచ్చె మెదరేసు గొల్లెన యుంగద మెల్లి విసివి
యోహరిసాహరి యప్పసఁబట్టియ యుఱిముఱి క్రన్నన యాల మలఁతి
యాబిడ నిరుడు నయ్యాటంబు నెమ్మోము బమ్మెర కెలాటకమ్ము కనుపు
క్రొన్నెల నెత్తమ్మి క్రొన్నన వంగుడు క్రిక్కులు వాలాయ మక్కు వాఁక
తక్కటి యేఁకట మెక్కటి బ్రుంగుడు వఱువాత వండలి వంత వఱపు
లగ్గు పల్లియ పెండి యగ్గంబరిది జన్నెపలుకులు చెచ్చెరఁ బొఱుఁడు కరి
సోబె యోడలదొంతి లేబర డెంకణా లుప్పవడం బర యోల మనలు
కరకరి సేవిరి కలువడం బన్నువ తెమ్మెర రజ్జులు దిమ్మనంగ
తత్సమ దేశ్య తద్భవములఁ గలయని తేటమాటగు లచ్చతెనుఁగ నఁ దగు
నది యెట్టులన:—నింక నలరు పేరు కొలంకు నూనెనా నాముదంబానవాలు
బండి పసర మొద్దు పండు పవ్వ పువ్వు రాక లాకులు సాకు బాఁకు మేకు
గుజ్జి మేనిక యొండ కోట వెన్నెల కొల్ల గడి పులి నెల వలి మనుఁగన ని:

గ్రామా లజాలు పురాణాలు దోషాలు శాస్త్రాలు వేదాలు నంబరాలు
గంతులు పోక్కులు గ్రద్దలు బొందలు గానాలు మొదలుగాఁ గల పదములు
వాసేవు పైర్లు రాగేసేవు నీవూను కూసుకుంటా గొంతి గుద్దరాకు
పాడేవు కాలెత్తి యాడేవు వస్తాని సూసేవు దాని కంతాసమీరె
ననుక్రియల్నోద్దలైన యవి గ్రామ్యములగు నిట్టివి తెగడునెడ నగవుతతిఁ దగు
సరవిగ దీనను సంజ్ఞాప్రకరణంబు వివరింతుఁ గలదంత కవులు వినుఁడి
ఆదులు స్వరములు నచ్చు లనఁగ నొప్పుఁ గాదులు హల్వ్యంజనాఖ్యలఁ దగుఁ
రహా, అకారము కవర్గము హాకారము విసర్గలు కంఠభవములై నలువుగాఁచుఁ
గన, ఇకారము చవర్గము యకారశకారములు తాలుభవములై యలరుమిగుల
నిఁక, ఉత్వము పవర్గ మిఁకలు నోష్ఠభవములు దంతోష్ఠభవము వకార
మొగి ఋటురషములుతగుమూర్ధభవములై యగు ౡతులసలుదంత్యములనంగఁ
గన నేత్వ మైత్వంబుఁ గంఠతాలవ్యంబు లోత్వ మౌత్వంబు కంఠోష్ఠ్యము లగు
నరయంగ యరలవ లంతస్థ లనఁ బొల్చు శషసహలూష్మాఖ్యఁ జనును మఱి ఙ
ఞమణన లనునాసికములునొ ఁఃకలిఃప లివిజిహ్వామూలభవమనంగఁ
నలయుపధ్మానీయ మనఁ దగు నీరెంపు తెలుఁగు పదములలోపలఁ గలవిఁక
నవల నజంతహలంతసంధులన సంధులు ద్వివిధంబులై పెలయు నందు
ల నజంతసంధి యెట్లన వినుం డాది శబ్దాంతవర్ణంబు తదగ్రశబ్ద
(పూర్వ)వర్ణంబుతోఁ బొందునందిన సంధి యగు దీని కింక లక్ష్యము లొనర్తు
నచ్చుపై నచ్చున్న నది యకారం బగు నెంతయుమ్మా యింతి యివియన మఱి
యాదంత మీదంత మూదంతముల మీఁద నచ్చున్నయకార మగునదినిఁ
డానవాలాయిల్లు మానిసియొక్కరుం డిందూ యనుచు వేఁడె నిందన నిఁక
నవలనిదంతము (లయి)నట్టిక్రియలకుఁ దగు కిషష్టికి నుదంతంబులకును
బైనచ్చు గల్గినఁ బవరూప మంతట నిత్యంబుగా వచ్చి నెగడుఁ గృతులఁ
గంటి కివెల్లను ఘనున కిచ్చి రనంగ శి (ఖరిణి) కెంతహర్షించి రనఁగఁ
దగిన తనకుదారధర్మపాలనలీల యనఁగఁ ద్రేతాగ్ను లేమయ్యె నాఁగ
నలయదంతముల.కే యచ్చు పైనుండినఁ బరరూప మొక్కచోఁ బరఁగునంద్రు
ముని కినుకుడిగె గంగనుకాసె చేష్టొప్ప మహిమెట్టి దెంతొరు లహియనమఱి
యాపరరూపంబె యగు నిదంతములకొక్కెడలఁ జేతిది చేతియిది యనంగ
నఖిలప్రబంధంబులందలిలక్ష్యము శ్వోశ్వేఆ యొకకొన్ని విస్తరింతు

నెమ్మెచ్చె నాఁగను దమ్మెంట్లు నాఁగను దిష్వెంత యనఁగ మదించె ననఁగ
వానిదవంధ్యజీవన మనంగ ననలజ్యోతుండ నన నిచ్చుచుండు ననఁగ
నంతం తనఁగఁబరమాత్ముండు రనఁ దామరసనేత్రలిండ్లన బ్రహ్మతఁడన
శౌరిచ్చు భక్తి వేసారక యెంతధికం బైన గురునాజ్ఞ గనుఁగొన నన
మీ రిప్పు డఁద జొమ్మికను బొత్తిది యన నేయుమేయు మన నేమేయనంగ
నెలయుచునుండు నివ్విధముగ నింక హలంతసంధులు కొన్ని యనుర వినుఁడి
అఖిలశబ్దాంతక్రియాంతనకారము ల్నిలుచును బై నచ్చు గలుగు నెడలఁ
గలుగని యెడలఁ బై కచటతపలు గల్గ నవి గజడదబలై యానకార
ములు సున్నలగుచుఁ బొల్పుగఁ దగు నీయైదు వర్ణము ల్గాకను బైని వేఱె
హల్లున్నఁ జను వచ్చు నల్లనకారము వరుస వీనికి నుదాహరణ లెన్న
రిపు నోర్చె బహుమతి నృపుచేతఁగంటివి నీకంటెఁ జతురుండు నీకుఁ దరము
నీకెన్నఁ బ్రతియు భూలోకాన లేఁ డౌర కవుల రమ్మని వేఁడు కన్వచింతు
వర్థులవీక్షింతు వఁని నివసముల నింతువనఁగ నిల్లు నెగడు నింక
రహాక్కేక్క లు ష్టవర్ణపదసంధులు గల తెఱఁగులు కొన్నింటెఁ దేటపఱుతు
నచ్చతెన్గునుడుల నంత్యము లగు డురునులులు నమమను గడలఁ దగిలెడి
తఱిని వానఁగల యుత్వము నిల్చుఁ బోవును హల్లులుపై నున్న నది యెటులన
నీమరాజులనంగ నీద్రాజు లనఁ దోడు గలిగె ననంగఁ దోడ్గలిగె ననఁగ
నూరుఁగాయ యనంగ నూర్గాయ యన జాలుఁగొప్పనా నిడుద జార్గొప్పనంగఁ
గనుపండుగ యనంగఁ గన్పండుగన ఏనువాఁక యనంగ ఏన్వాక యనఁగ
వాలుమించులునాఁగ వాల్మించులన మేలుకనె నన మేల్కనె ననఁ దగు మఱి
యొక పేరఁగూర్చి పలుకుచోడుపురుషులఁగల యుల్వమట్టుల నిలుచుఁ బోవు
గాడుపు గాడ్పనఁ గడుపు కడ్పన నొప్పు నప్పు డప్పన నిట్టు లమరుచుండు
నేరుపు నాఁగను నేర్పునాఁ దనరు నెత్తురనంగ నెత్తునాఁ బరఁగు మఱియు
నులులపై నుత్వ మట్టుల నడుమఁ దగుఁగడనులుల యుత్వ మట్ల తగదెందు
కానుపు కాన్పునాఁ గనుము కన్మన నొప్పుఁ గలను చదలన నీగతిఁ దగునిఁకఁ
బరికింపఁ బూర్వప్రబంధప్రయోగము ల్వివరింతు నొకకొన్ని వినుఁడు తెలియ
నల్లంతములకు మధ్యర్థమా నిల్లంతముల కట్ల కూర్చి పలుకుతఱిని
అగడి తగ డ్త పొగడిత పొగడ్తనా గిలక గ్లిలయనంగ మొలక మొల్క

నాఁగ మలక ప్పల్ల నాఁగఁ బలక ప్పల్ల నాఁగఁ గొఱఁత కొర్త నాఁగ నిటులు
చెరలాట చెర్లాట చెలికానిరాక నాఁగఁ జెలికాడ్రాకనఁగఁ దగునిఁక
నేకపదమ్మున కిత్వ మణఁగుఁ గల్గుఁ గొలిమి కొల్మి యనఁ దగు మఱి పొట్ట
రేను పొత్రేనన నొను మన్నెఱికము మన్నెర్క మన నిట్లమరు నవలను
దెనుఁగున నైయాలకును విరళత్వంబు వచ్చు నణంగును వయిని పైని
అయిదును నైదును దయివాఱ దైవాఱ నవు నౌను గవులు కొలనఁగనిటులు
దలఁపఁ గ్రియాపదాంతము లైన రేఫలవయి నుత్వ మంతటఁ బరఁగు నణఁగు
నొకచోట హల్లుపై నున్న రమూధవుఁగొలుతురు తలఁపుమర్గువు ననఁగఁ
దోయజకువలయాప్తులు పశ్చిమాద్రిపైఁ గ్రుంకుదు ర్వడిగనా నింక నవల
లఘువులతుదిహల్లులకును డాపలనున్న సున్న లూఁదుచుఁ దేలుచును దలిర్చు
ఘనుఁడు ఘనుండునా నినుఁగనెను నినుంగనెనన నన్నునునిన్నునని మెడినుఁడు
వులపై నకారంపుఁబొల్లల్ నిలుచుఁ బోవు నచ్చుపై నుండెడియట్టిచోట
నిన్నునెఱుంగును నిన్నెఱుంగును నన్నునెఱుఁగు నన్నెఱుఁగునానిటులఁ దనరు
నవలదీర్ఘములపై నఱసున్న నూఁదరు గూఁడు తూఁడన నిట్లు గొఱలుచుండు
నరయంగ నిఁకమీఁద నన్నకారపుఁబొల్లనూఁదఁగఁ దగు నచ్చుపైఁదగు నెడఁ
బన్నుగ నందిని యన్నేటితరఁగనా వెన్నుండు నరున. కిచ్చెన్నుదుటన
నిటుల వెలయుచుండు నిఁకజశ్వరీతులు తెలిపెదఁ బ్రథమాంతములపయుకచ
టతపలైదును గసడదవలౌ రాముంపు గనియె లక్ష్మణుఁడు సెప్పెను గురుండు
డక్కిరి భరతుండు దక్కు శత్రుఘ్నుండు వుట్టెనా లక్ష్యము లిట్టి వింక
నవల సుబంతపర్యాయంబు నేర్పడ సర్వవిభక్తులసరణి దెలుపు
దలద్వితీయయు మొద లాఱువిభక్తుల యాకాంక్ష లేనిచో నలరుఁ బ్రథమ
యలప్రథమయు ద్వితీయయుఁ దృతీయ చతుర్థి పంచమి షష్ఠి సప్తమియు నవల
సంబోధనయు నాఁగ సరవితో నెనిమిదివగల విభక్తులు వఱలుచుండు
డుముపులు ప్రథమగ నమరుసౌ నిను లనునవి రెండునుద్వితీయయనఁ జెలంగుఁ
జేత చేతోడతోఁ జెలఁగుచుండుఁ దృతీయ యావల కై కొఱకనఁ జతుర్థి
వెలయుమఱి, కతన, వలన, కంటెను పొంటె*యనఁగను బంచమియైయెసంగు
నూహింపఁ గి, కినులు, యొక్క, లొ, లొనలన షష్ఠియై చెన్నారు సరవి నింక
నిందు నందు ననంగ నిలయు సప్తమిగ నొప్పు నోరి పిలుపు సంబోధన మగు

*పట్టి.

వరుస వీనికి నుదాహరణలు రాముండు, రాముని, రాముచే, రాముకొఱకు,
రామభద్రువలన, రామచంద్రునకు, శ్రీరాఘవునందు, నోరామ యనఁగ
నవలఁగూర్చనుద్వితీయకు గుఱించి యననాహరిగుఱించని రిట్టు లమరు లనఁగ
నల చేసి యనుతృతీయకు వచ్చుటంజేసి యనఁగ రాజిల్లు వలన ననియెడి
పంచమి కలయు శ్రీవలన ననంగ లోపలను షష్ఠి కిలలోపల ననంగఁ
దనరును విషయార్థమునను వర్తించు సప్తమికి భరతవిషయమునఁ జతురుఁ
డనఁదగు నిఁకఁ దత్సమాదులకు విభక్తు లెక్కైడ్డిచందంబు లెవ్వి యనినఁ
బొల్లలును విసర్గములుఁ బోవ సంస్కృతపదములఁ దెనుఁగువిభక్తు లెక్కఁ
బురుషవాచకములై పరఁగునదంతశబ్దంబు లన్నియు నుదంతమ్ము లగును
నలయుదంతంబు లుదంతంబు లగుచోట నొకనిఁ జెప్పఁ దలంపనొదవు 'డు' వది
తోడనె యజసున్నతోఁగూడి రాఁదగు ఘనయశుఁ డనఁగ రాఘవుఁడన నిఁకఁ
గన నాంతసాంతబుఋకారాంతశబ్దాలలో నొకకొన్ని పొల్పుగ వినుండు
తగ బ్రహ్మ వేధ మాంధాత నేత నియంత హర్త కర్త మొదలైనట్టిశబ్ద
ములకు డుప్రత్యయ మలయుత్వమును రాదు ధాతధాతృఁడనంగఁ దనరునొకటఁ
దగభూర్తముఖ్యపదచతుష్టయముతుద వచ్చు నడంగు దుత్వంబు వినుఁడు
భూర్తుండుభూర్తు వృద్ధుఁడు వృద్ధు నీచుండు నీచు మూర్ఖుఁడుమూర్ఖు నెగడిరనఁగ
లక్ష్యంబు లిట్లు చెలంగును వరుసగ నింకఁ దద్భేదంబు తేర్పఱింతుఁ
గనఁగఁ దిర్యగ్వాచకపదమ్ము లొక్కెడఁ బురుషాఖ్యల వికల్పముగ డుఁవు గని
కొఱలు నెట్లన నురగుం డురగము గజేంద్రుఁడు గజేంద్రమన ఘనుఁడుఘన మన
నరసింహుఁ డనఁగను నరసింహ మన నృకంఠీరవుఁ డన నృకంఠీరవమన
నశ్వోత్తముఁడు నాఁగ నశ్వోత్తమమన నైరావతుండనఁగ నైరావత మనఁ
బక్షీంద్రుఁడనఁగను బక్షీంద్రమనఁ గోకిలేంద్రుండనఁగఁ గోకిలేంద్రమనఁగఁ
బేర్కొన మఱి వర్ణభేదములఁ దలిర్చు జాత్యేకవాచకశబ్దములను
డుప్రత్యయమె యొప్పుచుగతిఁ దెల్పెదఁ గఱినీలండు బొల్లండు నీలఁ డనఁగ
మఱి జన్నఁ డనఁగ జమ్ముండన సారంగుఁ డనఁగనిట్టు లుదాహరణములలరు
స్థావరమ్ములఁ గొన్ని సరవిఁ డువుఁగని మందరుఁడు మందరముననంగఁ బర్వఁ
తుఁడుఁబర్వతమ్ముగోత్రుఁడుగోత్రముసముద్రుఁడుసముద్రమననిట్టులుసురతరుఁడు
సురతరు వనఁ బొల్చు మఱి యీగతిని బ్రయోగములు కబ్బంబులఁగానమింకఁ
దలఁప నిదంతశబ్దముల కన్నిటికిఁ బ్రథమైకవచనంబు పరఁగ డెందు

హరి మతి వారి యన్నరవిచేఁ బ్రాతిపదికము తదర్థంబు తేటపఱుపఁ
దగ నుకారాంతపదము పురుషాఖ్యల పుత్వంబు ముత్వంబుఁ బొందుచుండుఁ
బ్రభుప్రభుండన రహిగ నిర్విధముగ గురుఁడు గురువు వాఁగఁబరఁగుచుమఱి
యీదారి నుదులు లే వెం దింక స్త్రీలింగ పదములయందు వుప్రత్యయంబె
వచ్చును ధేనువు వధు వనుగతి నింకఁ దక్కిన యులయుదంతముల కెల్ల
వుత్వంబు గల్గుఁ బోవుడు మీఁద రాహువు రాహువనా బాహువు బాహువాఁగ
మేను మేరు వనంగ నూ రూను వన రఘు రఘు వన నిల్లు పరఁగు నవలను
నరవిగ గటు పటు శబ్దముల్ రెండు ప్రకారంబు చే నొంది కటువు పటువు
నావిరాజిలు నిట్టు లావల నింకొక్కనటుశబ్దము మువ్వుల వఱలు నెటవ
వటుఁడు వటువన నీవరుస నుదాహరణంబులు తెన్న దనర్చుచుండు
నివి యజంతప్రథమైకవచనములౌ నిఁక హలంతప్రథమైకవచన
ములవి యెట్లన్నఁ దెల్పుదు నొకకొన్నింటి నరవిమీఁఱ మధులిట్ఛబ్దమునకు
మధులిహా మనఁ బొల్చు మఱియు భూభృత్పదముకుదయున్న కకారమున కదంత
మైన జత్వము వచ్చి తోన భూభుజుఁ డనఁ జెలఁగుచునుండునిట్టులనుమఱియుఁ
దెలియ శబ్దాంతహల్లులకు ద్విత్వము నుత్వమును రాఁగ వాక్స్రక్కును విరాట్టు
మధులిట్టు దిక్కును మ్రాక్షి నొప్పును గొదవ హలంతముల కెల్ల బయిను కార
మమరెను కతన నుదంతశబ్దములకైవడి లక్ష్యముల్ గనుఁడు మీఁద
విత్పదంబునకును ద్విట్పదంబునకును వేదవిదుండు నా విద్విషుఁ డనఁ
దనరారుచుండు నీదారిగ నావల నింక నాంతమ్ముల కేర్పఱింతు
ఇన్నంతములవయి నెసఁగెడుప్రథమైకవచన మిదంతాలవలెనె కృతులఁ
జక్రియు వజ్రియు శార్ఙ్గి యన్నట్టులఁ దగు నింక బ్రహ్మశబ్దంబు దక్కఁ
దక్కిన నాంతశబ్దమ్ముల కన్నింటి కొరునామధేయమై యొప్పునెడల
*మువువికల్పమునఁ గలుగుఁ బేరు గానిచో నాంతాలఁదుప్రత్యయంబె వచ్చుఁ
గృతవర్ముఁ డనఁగను గృతవర్మ యన దేవశర్ముం డనఁగ దేవశర్మ యనఁగఁ
బుణ్యాత్ముఁ డనఁగను బుణ్యకర్ముఁ డన నా రాజన్పదమునకు రా జనఁదగు
నలయచేతనముల నాంతాల న్పొక్కచోటుల ముకారవుకారములు వరుసగఁ
బొసఁగెడువిధము దెల్పుదు నింక మీఁదటఁ గనుఁగొనఁ గర్మముఁ గర్మువనఁగఁ
దవరంగ ధర్మము ధర్మువునాఁ జెల్లు నవల మతుప్ప్రత్యయాంతములకు

*డలలకు మైత్రి.

మంతుఁడనంగను మఱియు వానంతంబులకు వంతుఁ డనఁగఁ జెలఁగు నిటులు
మతిమంతుఁ డన బుద్ధిమంతుం డనంగ భాస్వంతుఁ డనఁగఁ గులవంతుఁడనఁగఁ
బరఁగు నేకాక్షరపదములఁ దక్కఁగ శబ్దాంతదీర్ఘముల్ చనుఁ దెఱఁగున
శ్రీయన హ్రీయన ధీయన స్త్రీయన జ్యాయన *రాయన మాయనంగ
నబల కామిని తను యజ్వ చక్రి యనంగ వరుసతోనివి యుదాహరణములగు
నవలను నుప్రత్యయము వచ్చుతెఱఁ గింకఁ దెలిపెడిచేసెదఁ దేట పడఁగఁ
దెలియుము స్థావరతిర్యగ్ప్రాణివాచకముల నేకవచనము మువగు
నగము పన్నగము గందము నాఁగ నిట్టులఁ గృతులందు లక్ష్యంబులెసఁగు మఱియుఁ
గనఁ బ్రథమైకవచనము కారమునకుఁ †గసుబిందుయుక్తంబు కార మొదవి
దానంబు ధర్మంబు గానంబు కదనంబు వదనం బనఁగ నిట్లు వఱలు నింక
నాశబ్దమున కొప్పు నావ ద్యోభూశబ్దములు దివి భువి యనఁ బొనఁగు నింక
భ్రమపదం బభిలాషపదము నొక్కొకచోట స్త్రీలింగరూపమై చెలఁగు నెట్టు
లన భ్రమ భ్రమము నన నభిలాష యభిలాష మనఁగ నీరీతుల నమరు మఱియు
స్త్రీలింగరీతిఁ జరిత చరిత్రము లొకచక్కిఁ దనరు రామచరిత యనఁగ
హరిచరిత్ర యనంగ నసురశబ్దము నట్ల యసుర యసురుఁ డన నలరుచుండు
దనరంగ దూతపదమ్మును స్త్రీలింగరీతిఁ జెందును హరిదూత యనఁగఁ
దెఱఁగున నేకవచనముల్ బహువచనములెగాని ద్వివచనంబు ల గలుగవు
రహి నింకఁ బ్రథమాది బహువచనమ్ములు తెలిపెడిసేసెదఁ దేటగాఁగఁ
బురుషవాచకములై పరఁగు నదంతశబ్దంబు లన్నియు నుదంతమ్ము లగుచు
బయిని దెలుంగు విభక్తు లెక్కినతఱి నని ముచ్చు దెప్పుట నలయుదంత
ములమీఁదను లుకారములు వచ్చు బహుతను రాములు భీములు సోములనఁగ
నలద్వితీయమొదలౌ నాలుగువిభక్తులు వయిచున్నతఱిని లత్వములె వచ్చు
రాములఁ గని మొచు రాముల చేతను రాములకొఱకును రాములకత
మున రాములకును రాముల సొమ్ము ననునిట్టివియుదాహరణములై వెలయునింక
సంబోధనలకు ‡అత్వంబుకలుగఁ బొల్చు జనవర జనవరుం డనఁగ బహుత

* రైశబ్దమునకుఁ దత్సమరూపములు 'రై, రా' అని సార్వత్రికము. కాని వ్యవహారమున నాలుగురాళ్ళు చేతిలో నున్నవి. అని ధనార్థమున 'రా' ఉపయోగింపఁబడుచున్నది.

† కడుబిందువు, అనఁగాఁ బూర్ణబిందువు. ఇట్టిప్రయోగములు- చింత్యములు. అ, ఖండ బిందుయుత బు కార మొదవి ? ‡ దత్వంబు.

ప్రాక్స్వదీర్ఘాంతములై యూఱ యనవచ్చు యతులార విబుధులారా యనంగ
నటుల ఋదంతంబు లందు దీర్ఘము లగు శౌరీ యనంగను శౌరి యన యు
దంతమ్ములం దుత్వ మత్వమ్ము నాత్వమూ సురగురువా కల్పతరువ యనఁగ
స్థావరతిర్యక్పదముల ముత్వముమీఁది యుత్వ మత్వం బయి యొనరుచుండుఁ
జాదనద్రుమను హంసను యన్వహి బహుళ పరవి లాంతములైన శబ్దములతు
దల లుత్వములు రుత్వములగు గోపాలురు బాలురు దీనదయాళు రనఁగ
వరుస లక్ష్యము లివి యరయంగ నింక ఇదంతముల్ బహుళ నుదంతము లగు
హారులు కవు ల్గిరు లాదియా శబ్దమ్ము లింక హలంతమ్ము లేర్పరింతుఁ
దెలుఁగులకడల హల్లులకును ద్విత్వంబు నుత్వంబు జరగూ? యొనరుఁ గనుక
త్వక్కును వాక్కును స్రక్కును బహుళతను ద్వక్కులు వాక్కులు స్రక్కు లగును
రాజన బహుళతను రాజులు నాఁ జెల్లు బహుళతఁ గొన్నిటి ద్విరూపములు విరుఁను
వేదవిత్తు లనంగ వేదవిదు లనంగ విద్విట్టు లనఁగను విద్విషు లన
భూభుక్కు లనఁగను భూభుజు లన నింక స్త్రీలింగములగు నీరెంను[illegible]వేళ్ల
దారిగా నల "హలంతాద్వా" యనెడి సూత్రభంగి హలంతశబ్దములమీఁదఁ
డాబ్వికల్పతచే నడరఁగ నలనమిత్పదము సమిత్తులు సమిథ లన మఱియు
దిక్పదంబును దిశల్ దిక్కులనఁగ నిల్లు వెలయును లక్ష్యము శ్వేత్రు చేఁజు
దగు నింక మీఁద ద్విత్వముగల్గ నణఁగంగఁ దాంతంబులవి యేకతను బహుళతను
రూపద్వయమున మరుతు మరుత్తన మరుతులు మరుత్తులన రాజిలు మఱి తగు
నింద్రజితుఁ డనంగ నింద్రజిత్తుఁడు నా పరీక్షిత్తుఁ డనఁగ బరీక్షితుఁ డన
నింక యుష్మచ్ఛబ్ద మేకత నీ యన బహుళతను మీ యనఁ బ్రబలు దానఁ
బ్రథమైకవచనాన వచ్చు వుకారంబు రహిబహుత్వమున రుకలును వచ్చు
నీ వనుచోటుల నీవనియును దనరారు నీ వీవు మీ ర్మీర లనఁగ
నెసఁగు నస్మచ్ఛబ్ద మేకత నేయన బహుళతను మే యనఁ బరఁగి ప్రథమ
నేకవచనమున కెసఁగు నుకారంబు బహువచనమున ము వచ్చు నవల
నరయ నా, మా, యన నఖిలవిభక్తుల నేకత్వబహుతల నెసఁగు వరుస
నే ననుపలుకున కే ననఁగా వచ్చు మే మనుపలుకున కే మనఁదగు
భూమి నే నేనన మే మేమనఁగ నొప్పుఁ గవిరాజు లివి తెల్ప గనవలె నిఁక
నరయంగఁ బంచవిధాంధ్రశబ్దములలో దేశీయముల నచ్చతెనుఁగులందు
ఫరవిగా నేకవచనబహువచనముల్ వివరింతుఁ గొన్నింటి విశదముగను

గనుఁడు తిర్యగ్వాచకపదమ్ములందునఁ బరఁగు నొక్కెడను ముప్రత్యయంబు
వారువ మనఁ బారువ మన నుదాహరణంబు లీక్రిఁ దనర్చు నవలఁ
దెలుఁగుల దేశ్యాల నల ప్రాతిపదికంబె ప్రథమైకవచనమై పరఁగుచుండుఁ
గలువ వలువ నాఁగ గడి మడియుఁగను జెఱువు హరువునాఁగఁ జెలికపాలఁకు
ఎమ్మె గేదెయు గాదె తమ్మె దివ్వె యనంగ మల్లె యొల్లె యనంగఁ జెల్లు నవలఁ
దగఁ బసి సోలముంత మొదలౌ నుడుగుల బార మూర మొదలౌ పేరులందు
నల మొఁడుప్రత్యయం బటసున్నతోఁ బ్రమాణార్థసూచకములై యమరుచోటఁ
బడెఁడు సోలెఁడు ముంతెఁడునాఁగ బారెఁడుమూరెఁడునాలక్ష్యములగునుమఱి
అచ్చు తెరుఁగున నదంతపురుష వాచకపదమున నువు వికల్పత తగి
వరుసగ-పాప పాపఁడు గొల్ల గొల్లఁడు మూల మూలఁ డన నీయూర్జిఁ దనరు
నవల నుదంతములందు ఁడుప్రత్యయము తగి చెలువుఁ డనఁ బొలుచు నొకట
బహువచన మగు లు పరమైన పూర్వవర్ణముల కుత్వం బిదంతముల వచ్చు
నరి యనేకవచనమువందు లుకార మమర బహువచన మగు నరు లన
నిఁక మీఁద నొకకొన్ని యేర్పఱుతు వినుండు రహికెక్క మీఁదక్కరముల చేత
బరఁగు నిదంతశబ్దంబుల నడిమియక్షరముల యుత్వంబు గలిగనేని
గనఁ దుది నడిమి యికారమ్ములకు రెంటి కుత్వంబు వచ్చి బహుత్వమునను
గలుములు ములుకులు గనులు నా నిట్టు లక్ష్యములవ్వునఁ దెలంగు నవులఁ
గొల ననుశబ్దముకు గో ననుశబ్దముకు లలి బహువచనమ్ములకు గులు గని
కొలనులు కొలఁకులు గోనులు గోఁగులు నానొప్పు మఱి పేరు మీను చేన
న నివియు బహువచనముల లుత్వము వచ్చి పేలునా మీలునా జేలనఁ దగుఁ
గనఁ బెండ్లి యన్పదమునఁ గల లత్వంబు వికల్పమై పెండిల స్పరణిఁ దనరు
బహుత నిం డ్లనియెడిప్రత్యయం బది చెంది పెండ్లిండ్లు నాఁగను వెలయు నవలఁ
బల్లు నిల్లనుచోట బహుతను బిందుపూర్వకముగా డులువచ్చి పండ్లు పందు
లిం డ్లిండు లన నిట్టు లెసఁగును మఱి యచేతనము లైనట్టిశబ్దముల కెల్ల
బహుత నట్టులు డులు వచ్చి కండ్లును ముండ్లు ననఁగ నీరీతుల నమరు మఱియు
వినుఁడు విల్లనునచేతనశబ్దమున కెన్న బహుత డులులు రెండు వచ్చు నెడల
విండ్లన విండులు విల్లులు నాఁగను సూత్రయంబున రూఢిగాంచు
డుటులపై యచ్చు లుండును బోవుఁ బాడులు పండ్లునాఁ జెండులు చెండ్లనంగఁ
దేఁటులు తేండ్లునా బోఁటులు బోంట్లునా నెగడుఁ జుండిఁక చేయి నేయి వాయి

యనెడు పేరులతుదలను బహువచనమ్ములఁ దులువచ్చుఁ గనుండు లక్ష్యములను
జేతులు నేతులు నాతు లన్నట్టుల నావల నంత్యములైన డురులు
లకు లుకారము వచ్చు డత్వాది శత్వమాఁ బై యున్న యుత్వంబు వాయు నొకట
వినుఁడు త్రాడులు త్రాళ్లు పేరులు పేళ్లు కాళులు కాళ్లు నాఁగను వెలయు త్రాయి
వేయి రేయుల వ్రాయి నాయుక్తు లట్టుకౌ త్రాలు వేలును రేలు వ్రాలనంగ
నిఁక నేకవచనమ్మునకు బహుత కొకవగ ననుర డాలు కేలనఁగ నిరులు
పాలు చాలన నిట్లు పరఁగు ధాన్యములపే ళ్లనుములు జొన్నలు నాళ్లు వడ్లు
గోదుమ లులువలు కొఱ్ఱలనఁగఁ జెలియలు కోడ లా ల్లుఱఁద లనుపదము
లతుదలఁ ద్రులు వచ్చులరుఁ జెలియంద్రు కోడంద్రు నాంద్రు నుఱఁదంద్రు నాఁగ
నావలను మొగలిపూవులు దక్కను దీవెలం దరుల వర్తిలెడి పేళ్లు
వానిపూవులయందు వర్తిల్లు బహుతను మల్లెలు సంపెగ ల్లొల్ల లనఁగ
నిఁక మీఁద నొకకొన్ని యేర్పరించెద లెస్స యరయుఁడీ వాఁడు వీఁడన నివిబహు
వచనములను వాండ్రు వారు వార లనంగ వీండ్రు నా వీరు నా వీర లనఁగ
నీరీతిఁ దనరారు నీశబ్దముల కెల్ల బహుతను ద్రురు లివి వచ్చు నిటుల
గాఁడు నకును గాండ్రు గారు నాఁ దగు పాళెగాండ్రు నాఁగను పాళెగార నంగఁ
గొండ పోఁదండ రేయెండ చంద్రను శబ్దములను బహువచనమ్ముల లు వచ్చి
గొండ లనంగఁ బొందండ లనంగ రేయెండ లనంగను జంద్ర లనఁగఁ
దగుఁ గూఁతుర నెడి శబ్దమునకు రుత్వంబు తొలఁగును నిలుచు గూఁతురును గూఁతు
కూఁతురు ల్గూఁతులు కొఱలును రన నిట్టు లిఁక ద్వితీయ విధంబు లేర్పరింతు
నాదేశముల నగు నలయుదంతములకు స్వాభావికోదంత శబ్దములకుఁ
బురుషాఖ్యలగుచోటఁ బొసఁగు నిన్ నులు రెండు రాముని గాంచెను రామునరసె
శంభుని నడిగెను శంభు నర్థించెనా వరుసతో నివి యేకవచనము లగుఁ
బారి నుదంతంబులు పురుషాఖ్య గానిచో భువి నకారపుఁ బొల్లునువు ను నిలుచు
నజరభూమీజము౯ హారిహాయధేనువు నడిగెఁ జెట్టుం గట్టు నడుగఁ దనఁగ
నలయిదంతముల నదంతమ్ములను నట్ల పొసఁగు నకారంపుఁ *బొల్ల రొకటి
శౌరి నీక్షించెను శౌరిఁ గనుంగొనె నతివ నారసె బ్రహ్మ నడిగె ననఁగఁ
దగునుదాహరణము లగు నిఁకిట సకర్మకములైన క్రియలపైఁ గలిగెనేని
గన నచేతనవాచకపదముల ద్వితీయ లొకచోటఁ బ్రథమలై యొప్పుచుండు

* పొల్లయని యదంతరూపము కూడ నీకవి కిష్టము. అది యుచితమును గావచ్చును.

బలుఁడు సొమ్ములుఁ దాల్చెఁ జెలులు కోకలు గట్టి రిన సూత్రమిన్నుదన్నె నన మఱియు
వలనకర్మకములై పఱల నారీతుల గిరు లొప్పె ననఁ దరు ల్వ్రీఁగె ననఁగ
నగునిట్లు యిఁకఁ దృతీయకు వివరించెద స్థావరతిర్యక్పదములు విడిచి
కనఁ దృతీయాదులకును లోనుగాఁ బురుషాఖ్యపదముల పైయక్షరముల
తుదలయుత్వములపై నొదవు నికారము వహి వికల్పమ్ముగ వచ్చుఁ గృతులఁ
దగుకివష్ఠికి నిత్వ మగుఁ గుషష్ఠికి నత్వ మమరుచునుండు నీక్రమము వినుఁడు
సోమునిచేతను సోముచేత ననంగ గురునికొఱకు గురుకొఱకు ననఁగఁ
గేశవునివలనఁ గేశవువలననా నజుని కజునకన నలరుచుండు
నావల మఱి తృతీయావిభక్త్యర్థంబున మయి మై యనునుడు లమరు వినుఁడు
మానివర్యులఁ బ్రీతిమయి నొప్పు హరుఁడనహరిభక్తిమైఁ బొల్చునభవుఁడనఁగ
నిఁకఁ జతుర్థి వచింతు నేర్పడ రామునికై రాముకొఱకనంగ మఱి యవల
నరవిఁ జతుర్థికి షష్ఠి వచ్చును బ్రాహ్మణునికి దానం బిచ్చె ననఁగఁ బ్రాహ్మ
ణునికొఱకిచ్చె నంచు నెఱుంగఁ దగు మఱి వేంకటాచలపతి కంకిత మన
నాహరికొఱకు సమర్పితం బనుటయే పాద్యంబు వేదాంతవేద్యున కన
దండితరాత్మసాధ్యత్మునకుఁ బ్రమొక్కు లనఁగ నిట్టివి చతుర్థ్యర్థము లగుఁ
బయినిబంచమికిఁ బొంటెయనంగఁ దనరారు బుధుఁడెవ్వఁడు నలువపొంటె ననఁగఁ
గృష్ణునికంటెను గృష్ణుకంటె ననఁ నింక షష్ఠిక్రమం బేర్పరింతుఁ
దగునుకారాంతశబ్దములకు కునులు పై నగునెడల నకార మాది నిల్చు
ననుటచే నలిబలమున కింద్రజిత్తునకును దేవగురునకు ననఁ దగు నిఁక
వరుసఁ బెండ్లామునకు వంతుకు రాజునకుఁ గైలాసమునకుఁ బ్రయోగములు గలవు
మొనయఁగ నలిబలమునకు నింద్రజిత్తుకు ననియిట్లు ముకుతుకు లమర వెందు
వహికినులకు నలవడు నకారపుఁబొల్లు లుండుఁ బో నచ్చు పైనుండునెడల
మునికి నెనయె మునికెనయె తనకు నెనయె తనకెనయె నాఁగ నిటుల నవల
నల ప్రాతిపదిక ముదంతంబు గానిచోఁ గుకినుల కాది నెక్కొనదు నత్వ
మచలకు రమకు నృహరికి గిరికి నాఁగ వరుస నిట్టుల నుదాహరణము లగు
షష్ఠి కొక్కెడ విశేషణములఁ బ్రథమలౌ ఘనభుజాబలుఁడు భీముని కనంగ
నమితబలుఁడు కౌరవాధీశున కనంగ-నింక సప్తమి తెఱం గేర్పరింతుఁ
బురుషాఖ్యల నుదంతముల కేకవచనంబు గయినుండిన ని వికల్పముగ వచ్చు
నానికారము రానిచో నకారము వచ్చు హరునియందు హరునం దనఁగ మఱియు

నప్రాణిపదములయందుఁ దిర్యక్పదముల నేకవచనంబు గలుగఁ బైన
నినలు రెండును రాక దనరుఁ బలకయందు నవనియందనఁ బక్షియందు నంచ
యందన్న యట్టు లుదంతమ్ములైనచో నమరు నత్వము వికల్పమున వినుఁడు
హరువునందుఁ జెఱువునం దన హరువందుఁ జెఱువందునన్నట్లు చెల్లు మఱియుఁ
బసువునందు ననంగఁ బసునందు ననఁ దేలునందుఁ దేలందు ననంగ నవల
సతిసప్తములు గల్గు జాడలయందు సప్తము లెల్లఁ బ్రథమరూపములు దాల్చుఁ
జుక్కలు వరుసఁగా తోరణగండ్లరా హరి యజ్జునకుఁ బ్రాపగుచునుండ
నన మఱి హరి వెలయ నసురాళి పొలియు నిలఁ దనరఁగ గొప్పమలయ ననఁగ
నుగ్రునిభక్తిసేయుఁడు ధనమిచ్చుఁడు రసికులకు ఫలంబు లొసఁగుఁడు నన
నరవి నిట్టివి సతిసప్తములై యొప్పు నింకఁ దద్భేదంబు లెఱుకపఱుతుఁ
గాలవాచకముల కడల సప్తమికిఁ బ్రథమ వచ్చు రేమొలంత నిమురగనెఁ
బగలు మ్రొల్లవియుండెఁ బడఁతులతలమిన్న యెసఁగు వర్షాకాల మెట్టిదొరలు
దండు వెడల రన ధరణీధవుకుమారుఁ డేఁడాది చదివెఁ గావేరిపరువు
నెలవర్తిలునదినా నెలదినాలగు సీత యనఁగ సిక్రియ నుదాహరణము లగుఁ
దెలియ నచేతనమ్ముల సప్తమికిఁ ద్వితీయకు తృతీయము వచ్చు నది యెటులన
వని నున్నది మదేభవార మనులఁ దనయసిని జన్మగఁజేసె నంగన మెయిఁ
గలప మలంచెను బలిమి నసురగెల్చె ననునిట్టు లక్ష్యము ల్గనుఁడు సుకవు
లచ్చతెనుఁగున నప్రాణివాచకోదంతములపయి సప్తమికి మఱి తృ
తీయకు నగ్ వచ్చుఁ దెలియ నాదేశమై కొమ్మన న్నిల్చెఁ గొంగునను విసరె
ననఁగ నిట్టుల నుదాహరణంబు లగు మఱి యప్రాణివాచకోదంతముల నె
కన్ను వెన్నను జన్ను మిన్నను నుకులకు గుంట వెంటను జంట మింటననఁగఁ
జనుఁ ద్వితీయను బంచమిని సప్తమిని నొక్క రూపమగా లక్ష్యముల్ రూఢివినుఁడు
చెలికంటఁజూచెను చెలికంటఁబొడమెను నిదికంటఁగాటుక నిడియె ననఁగ
వెలయుచునుండు నావల మఱి యప్రాణివాచకాదంతశబ్దములపయి నె
సఁగుతృతీయకును బంచమికి సప్తమికి నుకారము వచ్చు లక్ష్యములు వినుఁడు
తరలాక్షి బాహులతం గట్టెఁ జెలువుని లతను విరుల్ వుట్టె లతను జివురు
తగు నన నికి ఇదంతముల నాత్రి విభక్తులందుఁ బొల్లునకార మల నికార
మమరంగ వచ్చును వినుతియుం డసిని దెగటారె నసిం దెగటారె ననఁగఁ
గ్రొంచము తొలిని రాయించలు వెడలెనాఁ గడలి శుద్ధిరఁజెందెఁ గంసవైరి

యనఁగ నిట్టుల నుదాహరణలు తగు నింక స్థావరప్రాణివాచకము లగుచుఁ
దగు నుకారాంతశబ్దము లకారాంతము లగు పంచమీతృతీయలను సప్త
మి నల బహుత నేకతను రెంట ను జెలంగు గట్లనువచ్చెను గట్లవచ్చె
ననఁ జెలి వ్రేలఁ జూపెను వ్రేళ్ళఁ జూపెనా నొకయూరనిలుచు వాఁడూళ్ళనిలుచు
నన నింక నీరు గోరును నోరని యెడి శబ్దము లదంతంబు లౌతఱిని రేఫ
లకు టకారములు వాలాయంబుగా వచ్చు నీటను గోటను నోట ననఁగ
వీడు త్రాడును గోడు గూఁడను శబ్దముల డకారముల టకారములు వచ్చు
వీటఁ ద్రాటను గోట గూఁట నాఁదగు నింక నావలఁ గిక్ పరమైనయెడను
బూర్వమైన టకారముపయి ద్విత్వమువచ్చి యేటికి నేఁటికి నేఁటి కనఁగఁ
దనరాయుచుండు నుదాహరణము లిట్లు క్రమమొకింతయుఁ దప్పక నిఁక నవల
వహిని నచేతనవాచక స్త్రీలింగములకు విశేషణా లున్నపుంస
కములునై నరిల్లుఁ గనుఁగొనుం డిఁక లెస్స హరిదృష్టి భాగ్యదాయక మనంగ
వెన్నునిసభ మణీవిలసితం బన నింకఁ దెలుఁగుబహువచనములకుఁ బ్రాణి
పదము వెలిగ నేకవచన మది విశేషణమయి తగు హరిగుణములు ఖ్యాత
మనఁగ నవ్వ్షరంబు లధికంబన వడగండ్లాస్యస్రవత్ఫేన మయ్యె ననఁగ
నావలఁ దెలుఁగున నవ్యయాలయినట్టి పదములు కొన్ని యేర్పఱుతు వినుఁడి
యప్పు డిప్పుడు గాన నచ్చట నిచ్చట నక్క డిక్కడఁ గాక యాడ యీడ
మఱియు వేమఱు పలుమఱు గావున నటుగనక వెండి క్రమ్మఱ నాఁదగు నిఁకఁ
దెలుఁగున నొకకొన్ని స్త్రీ ప్రత్యయంబులు తెలియఁజెప్పెద సత్కవులు వినుండు
మొదలను గుణపదముల నెనయుచు మీఁద నాలున్న దానికి రాలు వచ్చు
రేఫ కచ్చునకును గృతుల నొక్కొక్కచోట యతులు వికల్పాన నమరియుండు
జవరాలు గొడ్రాలు చదురాలు ముద్దరా లనఁగ నిల్లా ల్వెలయాలు దక్క
నవల నాఁడను ప్రత్యయము వచ్చి వగలాఁడి చిన్నెలాఁడి యనఁగఁ జెలఁగు నింక
నలకత్తె యను ప్రత్యయము వచ్చి సొగసుకత్తె వెలకత్తె చెలికత్తెయనఁ దనరు
నంత ఎత ప్రత్యయము వచ్చి గుబ్బెత కొమరెత యనఁగఁ దగును మఱి యెఱు
కెత చాకెత తిరుమాలెత బోయెతన వయోజాతివాచకముల సరణిఁ దనరు
నవల సాని ప్రత్యయము వచ్చి యేలికసానినా మంతరసాననఁ దగుఁ
బూవుఁబోఁడి మెఱుంగుఁబోఁణినా సుకుమారతను మనోహరతను దనరి రెండు
ననువుగ మతుబర్థమున నిపాతము లగు రహికెక్క నిటువంటి ప్రత్యయముల

నాద్యచ్చులను యతు లమరింపరాదింకఁ గారకములు తెల్పుతీరులు వినుఁ
డవలను గ్రియకు హేతువనంగఁ దగునది కారక మనుపేరు గాంచు నదియు
రహిఁ గర్తృకర్మకరణసంప్రదానముల్ కడునపాదానాధికరణము లని
యాఱువిధమ్ముల నగుఁ గారకమ్ము లవియె త్రయోవింశతివిధములఁ దగు
కర్తృకరణకారకములయందుఁ దృతీయ కర్మకారకమున కడుద్వితీయ
రహిసంప్రదానకారకమునందుఁ జతుర్థి దారిగా నలయపాదానకార
కమున బంచమి యధికరణకారకమున సప్తమి దగు వరుసఁగ నెటు లన
నీవఱ కెవ్వ రీత్రోవ గాననియది తెలివిడిఁజేసెదఁ దెలియుఁడింకఁ
గడువేడుక స్వతంత్రకర్తయు హేతుకర్తయుఁ గర్మకర్తయుఁ దగ నభిహిత
కర్త యనభిహితకర్తయు నని కర్త యైదుతెఱంగుల నలరు నందు
ఱేఁడిల నేలుచున్నాఁడనఁగ స్వతంత్రకర్త యగుచు లెస్స గానఁబడియె
వినయవంతులు హితంబునుబొందుదురు వారిఁ బొందించుహితమునుబుద్ధిమంతుఁ
డనుచు నీలాగున ననువొందఁ జెప్పిన స్ఫూర్తిగా నిది హేతుకర్త యయ్యె
హీనులదోషము ల్తానె కప్పడు నని రహిదోషపదము కర్మంబులేక
కర్తతానే యయ్యెఁ గనుక లెస్సగ నిది కనుఁగొనంగాఁ గర్మ కర్త యయ్యె
గొనకొని సూపకారునిచేత నన్నంబు పక్వంబుగాఁ జేయఁబడియెడు నని
యన్నంబు ప్రథమమై యలరెను గనుకయభిహితకర్తయగుచు వెలయుచుండు
వండు సువారంబువాఁ డన్న మనఁగ నీకరణి యనభిహితకర్తగు నిఁకఁ
గర్తకుఁ గ్రియచేతఁ గడునిష్టముగఁ బొందఁ దగినదిఁ కర్మాఖ్య దనరు నదియె
ఈప్సితకర్మ మనీప్సితకర్మంబు నలయీప్సితానీప్సితాఖ్యకర్మ
మకథితకర్మంబు స్వకర్తృకర్మం బభిహితకర్మం బనభిహితకర్మ
మనుచుఁ గర్మంబు సప్తాహ్వయంబులచేతఁ దగుఁ దెల్పెదను వరుసగ వినుండు
జనపతి యన్నంబు సాపడియెడు నన నీప్సితకర్మాఖ్య నెసఁగుచుండు
మును మూర్ఖుఁడు విషంబుఁదినియె ననఁగ నిది యయ్యనీప్సితకర్మయగుచుఁ దనరు
దొరకొని బాలుండు దువ్వగప్పినపాయసాన్నంబు మెసవెడి ననఁగ నిదియె
యీక్షింప నీప్సితానీప్సితకర్మాభిధానంబుచేతను దనరు మిగుల
నా దేవదత్తుండు యజ్ఞదత్తునెఱగొంగడి నడిగెడి నని వడిగ రెండు
కర్మంబు లునుప నకథితకర్మం బగుచుండును గృతులందు నూహసేయ
మూర్ఖ శిష్యుఁడు గ్రామమునుగూర్చి పోయెడిని గురుండు తచ్ఛిష్యునిమదినిఁడలఁ

పుచు గ్రామమునుగూర్చి పోఁజేయుచున్నాఁ డనిన శిష్యుఁ డలకర్తను గనియెను
గనుక నిట్టిది కర్తృకర్మనామంబుచేతను దనరారుచుండును గణింప
శ్రీయజ్ఞదత్తునిచేఁ జాఁప నడి నల్లఁబడుచున్న దనఁ జాఁప ప్రథమమైన
కతన నిదియె యభిహితకర్మనామధేయంబుచేఁ బొల్పుగ నలరుచుండు
యజ్ఞదత్తుఁడు చాఁప నల్లుచున్నాఁ డనుకరణి యనభిహితకర్మ మయ్యె
నల క్రియాసిద్ధియం దత్యంతసాధనం బౌనది కరణాహ్వయ మగు నదియె
గణనగ బాహ్యకరణము శారీరకకరణ మని కరణంబు ప్రబలు రెండు
తెఱఁగుల నెట్లన్న దేవదత్తుఁడు కత్తిచేతను జక్కనిచెట్టు నఱకు
చున్నాఁడనఁగ నిది యూహింప బాహ్యకరణ మగుచుఁ దలిర్చు రహింకెక్క
శ్రీశుండు కన్నులచే రూపమును గ్రహియింపుచున్నాఁడన నిట్టి దెల్లఁ
బఱికింప శారీరకరణాభిధానంబు చేతను మిగుల రాజిల్లు నింక
నీవి యొసంగుట కెవ్వాని గోరు నాతఁడె సంప్రదానాభిధఁ గను నదియు
మఱి ప్రేరక మ్మనుమంతృక మ్మను ననిరాకర్తృక మ్మని రహిగ సంప్ర
దానమ్ము త్రితయవిధము లగు నెట్లన గురుపుణ్యుఁ డగ్రజుకొఱకు నావు
నిచ్చుచున్నాఁ డన నిదియె ప్రేరకసంప్రదాన మగుచు లెస్సఁ దనరు మహిని
ఋషిరాజటు తెరువరికిఁ జెట్టునీడ యొసంగుచున్నాఁ డన సరవిగ నిది
యనుమంతృసంప్రదానాభిధానంబుచేతను రహికట్టియుండును దలంప
నరుఁడు హరికొఱకు విఱియిచ్చుచున్నాఁ డనఁగ నిది పఱికింప నాఁడెమమర
నల యనిరాకర్తృకాహ్వయసంప్రదాన మగుచుఁ దగుఁ బ్రబంధముల నింక
నొకచోటునుండి వేఱొకచోటి కరుగుట గానిపించిన నపాదాన మగును
జల మచలం బని యల యపాదానంబు రెండు పేరుల నొప్పుచుండు నందు
కాతు కదలెడి గుఱ్ఱమువలనఁ బడుచున్నాఁ డన దీనిచందము గణింపఁ
దగుఁ జలాపాదాన మగుచు నీలాగున నెసఁగుచు నుండును గృత్తులలోన
నొగి యజ్ఞదత్తకుం డూరనుండియుఁ జనుదెంచుచున్నాఁ డనఁ దెలియ నిదియె
నలువుమీఱ నచలనామకాపాదాన మనుచుఁ బొల్పెసఁగుఁ గావ్యములనింకఁ
గడుఁ గ్రియఁ జెందిన కర్తృకర్మముల యాధార మధికరణమౌ రహి నిది
యలయభివ్యాపక మనఁగ నౌపశ్లేషికం బన వైషయికం బనంగ
నవల సామీపికం బన నధికరణము నలు దెఱంగు లను జెన్నలరు నందు
నువ్వులయందున నూనె గల దన నిది యె యభివ్యాపకాధికరణ మగు

గురుఁడు మంచమునందుఁ గూరుచున్నాఁ డన నల్ల యౌపశ్లేషికాధికరణ
మగు బ్రాహ్మణుఁడు గావ్యమునందుఁ గుశలుఁడౌ నన నిది వైషయికాధికరణ
మగును ఘోషముఁ గంగ యం దన సామీపికాధికరణ మగు నవల నింక
నదె మొదలిపదము తుదియక్షరమ్ముతోఁ బెఱనుడిమొదలియక్కరము గదియ
నదికించిన సమాస మండ్రు కోవిదు లందు నంధ్రభాషకుఁ జెల్లు నవియు వినుఁడు
తత్పురుషము కర్మధారయమును బహువ్రీహి ద్విగువు ద్వంద్వవిధము నవ్య
యీభావ మనఁ దగి యిత్తిగఁ దెఱఁగుల నమరు సమాసము లవియె యరయ
వింతమీఱఁగఁ బంచవింశతివిధములఁ బరఁగును దెలిపెద వరుస మీఱ
రహిఁగ నుత్తరపదార్థ ప్రధానం బయి తత్పురుషం బది తనరుచుండు
ననువొంద నన్యపదార్థ ప్రధానమై యొప్పు బహువ్రీహి యెసఁగుచుండు
నమరంగ నుభయపదార్థప్రధానమై ద్వంద్వసమాసంబు వఱలుచుండు
నరయంగఁ బూర్వపదార్థప్రధానమై యవ్యయీభావ మొప్పగుచునుండు
పయిమెయి నడుగుమెయి యన నివి ప్రథమాతత్పురుషములై మలయుచుండు
దట్టిమోపరి కొండతాల్పరి యన ద్వితీయాతత్పురుషములై యలరుచుండుఁ
జేయీఁతయన దొంగచిల్లర యనఁ గత్తినఱకునాఁ బలుగంటినాఁగ గోటి
జీర యనఁగ రాచపోరునా నివి తృతీయాతత్పురుషములై యమరుచుండు
వలపుతిలక మనఁ దలుపుపలక యన గడియమ్రా నన మంచుకాటుక యనఁ
దేలుమందనఁ బాముమూలిక యనఁ జతుర్థీతత్పురుషమయి తేజరిల్లు
మోమోట మనఁగను బాముబీ తనఁగ నెత్తురుకళ యనఁగఁ గిత్తుబయ మనఁగ
ఖ్యాతి నన్నియుఁ బంచమీతత్పురుషనామమున వెలయుచునుండు ననువుమీఱ
దొరతీవి యడవిజోదులు రాచకొమరుండు కందోయి పూఁదావి కల్వదండ
పగడాలగని ముంపుగము లనంగ షష్ఠీతత్పురుషములై చెలువుగాంచుఁ
దగ మఱి షష్ఠ్యర్థతత్పురుషములంచుఁ గర్మధారయములఁ గన్గొనంగ
నలవిశేష్యపుఁబద మాత్యముకారమ్మునకుఁ బునాదేశ మంతటను వచ్చు
హల్లుపై నుండిన నచ్చుపైనున్నఁ బుటాదేశ మమరు నెట్లనిన వినుఁడు
వాదపుఁబాతంబు జూదపునవ్వు సున్నపురాగు సున్నపుద్రం గనంగ
ముత్తెపుంబాపట ముత్తైపాప టన నెయ్యపుటాదరమ్ము మోదపుటలుకన
వేలుపుటింతి నా వేల్పుటా వన నందలపుటను సన నిట్లు లక్ష్యము లగు
నిఁకఁ బుట్టాదేశ మొక్కెడ లే దుదంతాల మిన్నేఱు మొగమంద మన్నయట్లు

రూఢి షష్ఠీతత్పురుషములం దుత్వ మంత్యమునందుఁ గల్గు పదములపైని గలిగిన కచటతపలకు జశ్త్వము వికల్పముగ నొక్కొకచోట వచ్చు వినుఁడు పువ్వుఁబాళె నాఁగను బువ్వుఁబాళె యనఁ బువ్వుంబాళె యనఁ ద్రివిధంబులఁ దగ ములుఁగొన పలుదీపుఁ ముకుఁజెఱమలు రేఁగుఁబండ్లన నిట్లులఁ బరఁగు మఱియు షష్ఠ్యర్థతత్పురుషమునందుఁ గొన్ని పేళ్లకు జశ్త్వ మది వికల్పగతి రాము పాముకోఱ యనంగ వేముతీ వనఁ బలుకుసురు తీరనఁగ ముక్కుచెమట యనఁ జను, కను, నా నిట్టి శబ్దములతుదల నెఱసున్న దగు నూఁద నెగడుఁ దేల నఱసున్నయై యుండు నరయంగఁ బైని హల్లానఁ బలసంధిసేయఁ గనెడితఱి షష్ఠ్యర్థతత్పురుషను జనుంగవ యనఁ జన్నుంగవ యనగఁ జనుఁగవ యనఁ గన్నుంగవ యనంగఁ గన్నుఁగవ యనంగఁ గనుఁగవ యనఁగ నీకరణి మఱియు నీరెండుశబ్దము లేకాక్షరములైనఁ బయినుకారము పోల్లయయి తనరును సున్నగా దెటువలె శోధించిచూచిన నవల హల్లుల జశ్త్వ మగును సంధి ఘటియింపఁ జన్గవ కన్గవ యనఁదగు దీనికి బిందుయతి యిడఁ జెల్ల దేకాక్షరముల కొక్కెడఁజెల్లు నీరెంట రెండక్షరమ్ముల నుం*డలయతి యవల జక్కవకవ యనఁదగునట్టి త్ర్యక్షరములకవకు జశ్త్వంబు చెల్ల దదిదంతము లయినపదములు గొన్నింటి జాడ లెఱింగింతు సరవి వినుఁడు మొలకట్టు వలచూపు తలపొక్కు తలతిమ్మిరి యనుపేళ్లకు జశ్త్వరీతి చొరదు మడిచాలు పులికూన కుడిప్రక్క సిరితెల్వి యనుపదముల జశ్త్వ మమర దింక మును సంస్కృతము లయ్యుఁ దెనుఁగులౌ నొకకొన్నిశబ్దము లౌ వానిజాడ లెల్లఁ గనిపింతుఁ బనసపం డనఁ గుండలోపల ననఁ గందకుంప నా నల్లరు నింకఁ గనుఁగొన షష్ఠ్యర్థమున నుకారాంతశబ్దములపై నచ్చున్నఁ దగు నకార మధిపునానతి యన నభపునాజ్ఞ యనంగఁగూఁతునోడమెనాఁగఁగొఱలుమఱియుఁ దెనుఁగుటక్కర మ్మొక్క టున్నిచి యాదిని బయి సంస్కృతపదము లుంచఁగ సమాస మగును నా, నీ, తన, యనునుడితో దుత్వ మబ్బును బోవు షష్ఠ్యర్థమందు మఱియు నీ, నా, యను మాటలరెంట సమాసమౌ ద్విత్వ మమరదు వినుఁడు నావచోవైఖరి నీవిభవస్ఫూర్తి తనకళాసంపత్తి యనఁగ నింక నామువిద్యాప్రౌఢి నీమువిలాసంబు తనముభుజాబలం బనఁగ మఱియుఁ దనఘనకీర్తిప్రతాపకాంతు లనంగ నీయసమానసాహితి యనంగ

*ఇట్టి ద్రుతసంధుబు కవిత్రయేతరగ్రంథములందుఁ గ్వాచిత్కముగాఁ గనుపట్టుచున్నవి.

